ఓం

# శ్రీ శివ శంకర భజన కీర్తనలు





రచయిత:

**శ్రీ మూలమఠం రాజమౌళి గారు**

గ్రా॥ పంచకళపేట

మం॥ బెజ్జూరు

జిల్లా॥ ఆదిలాబాదు

వెల: 9.00/-

కీ॥ శే॥ శ్రీ మూలమఠం సిద్దయ్యగారు వీరి ధర్మపత్ని గౌరమ్మగారు గ్రా।దంచకలపేట. ఈగ్రంధముద్రణకు రూ॥3125ల ద్రవ్యసహాయము చేసినారు.



శ్లో॥ శ్రీ వీరశైవ సంపన్నా , శివయోగి విరాజితే,
వైద్యశేఖర, ప్రఖ్యాతం, శ్రీ సిద్దయార్యం ,
నిశంభజే




ఓం

# శ్రీ శివ శంకర భజన కీర్తనలు



రచయిత:

శ్రీ మూలమఠం రాజమౌళి గారు
గ్రా॥ పంచకళ్ళపేట, మం॥ బెజ్జూరు, జిల్లా॥ ఆదిలాబాదు

స్వస్తి శ్రీ బహుధాన్య నామ సంవత్సర శ్రావణ శు॥ సప్తమి గురువారం

రోజున తేది: 30-7-1998

# గ్రంథ కర్త పరిచయము

సమస్త భక్తాగ్రేసరులకు వేదపండిత గాయకులకు నాయొక్క నమః సుమాంజలి అర్పిస్తు విన్నవించునది యేమనగా.

నేను ఆదిలాబాదు జిల్లాలో సిర్పూర్ తాలుక నందుగల స్వస్థానమైన పంచకలప్యాటలో శ్రీ వీరశైవాచార సంపన్నులైన కీ॥శే॥ బ్రహ్మశ్రీ మూల మఠం మాంతయ్య గారు ధర్మ పత్ని శాంతమ్మ గర్భ వాస జనితుడను. స్వస్తి శ్రీ విజయ నామ సంవత్సర మాఘ శు॥ 1952 సం॥లో జన్మించినవాడను. నాయొక్క నామము రాజు మౌళీయని పిలుచుచుందురు. నేను చిన్ననాటి నుండియే దైవానుగ్రహమునకు పాత్రుడనై మా ఇలవైల్పు అయిన శ్రీ వీరభద్రకాళీ దేవాలయములో సేవలుచేయుచుండెటి వాడను. నాకు సంగీత సాహిత్యము అంటె చాలాయిష్టము కనుక భజనా కార్యక్రమములో పాల్గోనుచుండెటివాడను. కొంత కాలమునకు దైవానుగ్రహము చే నా హృదయమందు జనించిన ప్రేరేపన ప్రకారంగా కొన్ని భజన కీర్తనలు వ్రాసితిని నేను పండితుడను కాను శాస్త్రవేత్తను కాను యిది అంతయు దైవేచ్ఛ ప్రకారముగా యీ భక్తి కీర్తనలు పంచకళపుర ఈశ్వరునకు అంకితముగావించితిని. ఇందులో యేవైనా తప్పు ఓప్పులను గ్రహించిన మహనీయులు వీటిని సరిచేసి నన్ను కృతార్థుని జేయగలరని నాయొక్క మనవి.

గ్రంథ కర్త :-

శ్రీ మూల మఠంరాజ మౌళీ గారు

గ్రామం॥ పంచకలపేట.

# సీస పద్యం వంశావళీ

వసుధలో సిర్వారు తాలుక లోపల । వరపంచకలపురము. వెలయగాను । మూల మఠవంశమునమూర్తినిరంజనుడు. । ఫాలలోచనుడనబరిగినారు। వీరికి తనయుండు వరమాంత యాఖ్యుడు । పరగ యీశుని భక్తి చేప్రియముతోడ సతియు శాంతమ్మతోడను. సంభ్రమొంద । సుతుడు జన్మించే రాజుమౌళీ గనుడీ । హితవుతో సద్భక్తి సంతోసమున పతిత పావనమైనట్టి శివ శాసనంబు నిలపీ । పరగదెలిపెను భక్తులకు । పర మాత్మమహిమలెల్లా ।

వంశమూలము :

సీ ॥ ధరణిలో సిర్వారు తాలుక లోపలా
వరపంచకళపేట పురిని మూల
మఠ వంశ చంద్రుడు మానసీయుండయ్యె
ధనధాన్య సాధనో త్యాగియయ్యె
సిద్ధివీరయ్య ప్రసిద్ధి చెందివారు.
సతియు రాజమ్మకును సుతులు ఏడుగురును సతసంబున బండయ్య,
భద్రయ్య నిరంజనా చెండిక్రుపతో.
అండగరేవయ్య, గురువయ్య, సిద్దయ్య, నాగయ్య లండగ వారుండె.
ధర్మ ద్యేయముతోడన్.

శీ ॥ వీరికిన్ తోబుట్టువారులు వరుసతో ముగ్గురు శ్రీమతి అమ్మక్క, గౌర మ్మ, జగదాంబల నెడు వారు జన్మించె జగములో జగజ్జనని, కరుణ వలనా అగణితంబుగా శివభక్తి సలిపిరంతా.

సీ ॥ మహిలోన మాన్యుడు ।
మరిమాంతయార్యుండు శాంతమ్మ యనియెడి । సతిని గూడి,కడు భక్తితోడను, కాళికా వరముచే కనియె సుతత్రయంబుల, కాంక్ష తోడ, సుజ్ఞాన వరదుండు । సుజన సేవితుండు రాజమౌళి । ప్రాకటుంబుగా పంచాక్షరి, గురువయ్య ప్రభలముగను ప్రియముతో లింగాబీ ఈశ్వరి గిరిజలనెడువారు । పరగ కలిగిరి పరమాత్మ కరుణవలనా । భూరిజను లుగొలువంగ రేణుక రాజమౌళికిన్ । విశ్వేశ్వర, శివ ప్రసాదులనెడువా రు । సుతులకు తోబుట్టు సుందరీ జ్ఞాన కుమారి । ధ్యాన్నసేవలు జేయుచు శివుని దలచిరంతా.

ఓం

## విషయ సూచిక

ఓం

## విషయ సూచిక

# శివ దీక్ష ప్రతిజ్ఞ

## ఓం శ్రీ విఘ్నేశ్వరాయనమః

ఉ ॥ శ్రీ విఘ్నేశ్వర మీకును బాగుగ పూజలను సలిపి । భక్తి
తో నిపుడున్ । మోదముతోడను ముందుగా । మీద
గు నామంబు మరువ । నిక్కముతోడన్ । నా వదనంబుకు
చేరుము । పాదుగ శ్రీ విఘ్నేశ్వరాయ పార్వతిపుత్రా ॥

ఉ ॥ గణపతిషన్ముఖుండు । రిపుగర్వమణంచేటీ వీరభద్రుడున్।
గుణ హితుడైన భృంగియును । ఘోర పరాక్రమ
అంజనేయుడున్ । ఫణిధరుడైన భైరవుడు భక్త గణాధ్యుడు
నంది కేశుండున్ । గణములలో పలన్ ప్రమథగణ
ములయా శరభాంకలింగమా ॥

### 1వ కీర్తనా

జై శ్రీ గణేశా జయమొసగుమా
జయమొసగి నన్ను రక్షించు మా ॥ జై ॥

1. తొలుతను నిన్నె పూజింతు మయ్యా ॥
తలుతుము. నిన్నె ముందుగనయ్యా
కలకాలము నను కాపాడవయ్యా
మా ఇలవేల్పు కోలచెదమయ్యా ॥ జై ॥

2. లంబోదరమిము మరువమయా
అంబా సుతసదా బ్రోవుమయా
సంబరముగా మది నిలువుమయా
శాంభవి పుత్రప్రియతనయా ॥ జై ॥

3. మూషక వాహన రావయ్యా
మునిజన పోషణ నీవయ్యా
మరువ కాను నన్నేలుమయా
మురిపం బుగనీవు రావయ్యా ॥ జై ॥

4. వివిద విధ్యలకు ధాతవయా
విశ్వమంతట వెలసినవయ్యా
వరదాయకమొరవినవయ్యా
విరివిగా మీకృప నీయవయ్యా ॥ జై ॥

5. గజముఖ వదననీవయ్యా
నిజముగవేడితిరావయ్యా
విజయముతో కృతి సాగించుమయ్యా
వర రాజ మౌళినీదీవించుమయ్యా ॥ జై ॥

## 2. కీర్తిన

జగతీశ్వరీ భక్తవశ్యాంకరీ
దయజాడవమ్మాకృపాసాగరీ
మమురక్షించవమ్మా కరుణాకరీ ॥ జగధీశ్వరి ॥

1. చేరితి నీపద సన్నిధి జననీ
సరగున మీసేవచేసేద పూనీ
కరుణ తోడ మమ్మేలుమ జననీ
కాత్యాయణి పావనీ ॥ జగధీశ్వరి ॥

2. ముగ్గురు మూర్తుల మూలమునీవే
ముజ్జేగములకు మాతవునీవే
మహిలో వెలసిన మాయ శక్తివే
మహోన్నతంబైవెలసినదానివే ॥ జగధీశ్వరి ॥

3. సృష్టియంతటినీ కల్పించితివే
అష్టశక్తులలో ఆదిశక్తివే
శ్రేష్టమైన నీ శక్తి దెలియగా
నిష్టచేత నిజభక్తులు దలతురు ॥ జగధీశ్వరి ॥

4. నేనను వారినీ శిక్షించి నావే
నీదాసకోటిని రక్షించవీవే
నీవుగాక మరి యితరులెవ్వరే
నిరతముబ్రోచేపరమ పావనీ ॥ జగధీశ్వరి ॥

5. యీక్షితి నేలవే జగధీశ్వరీ
మమురక్షింపవమ్మారాజేశ్వరీ
పంచకళాపురా పరమేశ్వరీ
యంచుమీ కరుణా వరదాయనీ ॥ జగధీశ్వరీ ॥

## 3. కీర్తన

వందనం శ్రీ శారదాంబా వందనమమ్మా
ముందుగా మీపాదములను అందిపూజ జేతు మా॥ వంద ॥

1. విదిత బ్రహ్మకు రాణివీ
విఖ్యాతి నొందిన దానివీ
శబ్ద రూపస్వరూపినీ
వేదశాస్త్ర విరాగినీ
నాదు బిందు స్వరూపినీ
సాధుజన సంపోషినీ ॥ వంద ॥

2. జ్ఞాన శక్తి ప్రదాయినీ
సుజ్ఞాన నిలయవాసినీ
విజ్ఞాన పూరిత దాయినీ
ప్రజ్ఞానధ్యేయ ప్రకాశినీ
ధ్యానయోగ విరాగిణి
గాన వీణ ప్రదాయిణీ ॥ వందనం ॥

3. పంచభూత వికాసినీ
సంచలాత్మక సారీనీ
యెంచరానీ గేహినీ
మించియున్న ప్రదాయినీ
పంచకల పూరవాసీనీ
గాంచితిని స్వరూపినీ ॥ వందనం ॥

## 4. కీర్తన

శ్రీశంభునీ చరితం వినూ నిత్యం ॥ శ్రీ శంభునీ చరితం
క్షీరమధూభరితం శివాగీతం ॥ శ్రీ శంభు ॥

1. పరమాత్మ స్తోత్రం పావనగాత్రం
మరువరాదు నిత్యం, మరుగులేని సత్యం ॥ శ్రీ శంభు ॥

2. భవబాధనాశం పాప వినాశం బహుజన్మ తరుణం
భజియించు స్మరణం ॥ శ్రీ శంభు ॥

3 . మీమృదు చగణం మహితోద్ధరణం
మృత్యుంజయహారం మోక్షప్రధానం ॥ శ్రీ శంభు ॥

4. ఏ జన్మ పుణ్యమో ఈ జన్మదన్యం
అజుని వ్రాత శూన్యం భజియంచు గమ్యం ॥ శ్రీ శంభు ॥

5. పంచకళ వాసం పరమవిలాసం
ఎంచ దగిన రూపం గాంచగానే పుణ్యం ॥ శ్రీ శంభు ॥

## 5వ కీర్తన (సద్గురుదేవా ఓ సద్గురుదేవా )

పార్వతీశ్వరా ఓ పార్వతీశ్వరా
రావేలా మమ్ము పాలించరా ॥ పార్వ ॥

1. పన్నగేంద్ర పరమ పురుశ
కన్న తండ్రి కరుణాకర
ఎన్నరాని సఖము నిచ్చి
తిన్నగాను బ్రొవవేరా ॥ పార్వ ॥

2. కోపమేల కోమలాంగ
దాపుబేరీ యుంటినిరా
కోరినిన్ను భజయించేద
అపారవారమునులేకా ॥ పార్వ ॥

3. మారహరణ గౌరీ రమణ
మొరనువినగ రావదేరా
సరగునను బిరబరను
చేరరమ్ము కరుణాకర ॥ పార్వ ॥

4. పాపహరణ జగథీశ్వర
పతిత పపావన పరమేశ్వర
పంచకళ పుర ఈశ్వర
పరమ శివ పరమేశ్వర ॥ పార్వ ॥

## 6వ కీర్తన (ప్రభూజి నామస్మరణంబు)

పరమేశా నీదు నా మంబు । పలికినన్ పాపములు

బాయున్ ॥ పరవేశ ॥

1. కైలాసావాసా నివాసా । కరుణతో రావగిరీశా ।

కఠిన మూతలచకూమయ్యా । చిటిలో చింతదీర్చు

మయా ॥ పరమే ॥

2. సచ్చిదానంద రూపుడవూ । స్థావరమందు

నిల చావూ । సరగునచేరిననుబ్రోవూ

సాక్షాత్కారించి ననుకావు ॥ పరమే ॥

3. చండికాప్రియుడవు నీవే । దండి దేవాదిదేవుడవూ।

అండజేరితిననుకావా । కొండపైనుండి

ఇటురావా ॥ పరమే ॥

4. బుధజనులూ నిన్నువేడగనూ । భువననుత నన్నుగావగనూ

బసవేశ్వరా వాహనములోనూ । భక్తబృందమున

బ్రోవగనూ ॥ పర ॥

5. రజితగిరివాసనిలయేశా । విజయమూగూర్చుసర్వేశా

రాజమౌళికిని మీధ్యాసా। నిజముగా యుంచు

ఫణిభూశా ॥ పరమే ॥

# 7వ కీర్తన (పిలచినబగువటరా)

అలుగుట తగదేలరా । దేవాది దేవయిక ॥ అలుగ॥
అలుగుట తగదేలా । అలుకమాన్పవదేలా ॥
సకలాజీవులనెల్లా । సవరిచుటకు నీవె ॥ అలుగు ॥

1. అందముగను యీ జగతిస్సృష్టినీ । ఆదరముగపోషించీ
అండబాయకను అన్నపూర్ణ మీ అండనుండగా ।
ఆనందబగునా అవని జనాళికి ॥ అలుగు ॥

2. క్షితిలోనా లక్షలాదిగా । పక్షి జాతినర జంతు
జాలములు, మీ దీక్షలేక ఇలశిక్షలు బడయగ
। కక్షయేల ఇక రక్షణ చేయరా। పాలాక్షహరా
పార్వతీశ్వరా ॥ అలుగుట॥

3. మాయబద్ధులై హంకారంబున । మసలుచున్న
ఈ మానవాళికిన్, వశము గాదు మీ మహి
మలుదెలియగ, సురలకు భయమే నరులకు వశమే ॥ అలుగుట ॥

4. పరమ శివా ఓ పావనరూపా । పార్వతీశ్వరా
హేపరమేశ్వర । ప్రజలెల్లరు మిము ప్రస్తుతి
జేతరు । పంచకళాపుర పశుపతినాథా ॥ అలుగుట॥

5. అన్నపూర్ణ తో భువిలో వెలసిన । పన్న గభూషణపా
లాక్ష । సన్నుతించిగనుమన్నించియునను । తిన్నగ
బ్రోవు మీ పరమేశ ॥ దేవాది ॥

6. కారుణ్యరుప సర్వేశా । మాడరిదాపునీవయ్యా
హరయాశా । కరచర్మాంబర కాపగరావా । కరుణి
చయు కృపయుంచగలేవా ॥ దేవాది ॥

## 8వ కీర్తన

దేవాది దేవా త్రినేత్రా । భువనాతీతా త్రిభువ
నదాతా । వినలేవ నామొర విశ్వాదినాథ ॥దేవాది॥

1. నీవేదిక్కనీ నిఖిలములోనా । నిరథము కొలచిన
భక్తులకిలలోనా వరముల నొసగెడి గౌరీశా।
హర, హర, నా మొరగను మీశా ॥దేవా॥

2. అన్నపూర్ణతో భువిలో వెలసిన। పన్నగ భుషణ
పాలక్ష । సన్నుతించగను మన్నించియు నను
తిన్నగ బ్రోవుమి పరమేశా ॥దేవా॥

3. కారుణ్యరూపా సర్వేశా । మాదరి దాపు నీవయ్యా
హర ఈశా । కరి చర్మాంబర కావగరావా
కరుణించియు కృపయుంచగ లేవా ॥దేవా॥

4. సంచితనాశ సాక్షిస్వరూపా । గాంచితి మీ
మృదు చరణ ప్రదీపా । పంచ కళాపుర పరమ
ప్రకాశా । పాలించర సద్భక్త హృదీశా ॥దేవా॥

5. అన్నపూర్ణ తో భువిలో వెలసిన । పన్న గభూషణపా
లాక్ష । సన్నుతించిగనుమన్నించియునను । తిన్నగ
బ్రోవు మీ పరమేశ ॥ దేవాది ॥

6. కారుణ్యరుప సర్వేశా । మాడరిదాపునీవయ్యా
హరయాశా । కరచర్మాంబర కాపగరావా । కరుణి
చయు కృపయుంచగలేవా ॥ దేవాది ॥

## 9వ కీర్తన (జయపాండురంగప్రభో)

జయశివలింగప్రభో శంకరా ।
దయతో రావా జయ శంకరా ।
శంభో లింగ శంకర । అంబిక నాథ శంకరా ॥

1. పావన తీతగుణా వనలింగా ।
సేవలుజేతునమోశివలింగా
కావగలేవా భక్తాధీనా లింగా ।
కారుణ్యధాతా విభోహరలింగా ॥ విభోహర లింగా
। ప్రభో శివలింగా ॥ జయ ॥

2. ప్రార్థన సజేతుపరాత్పరలింగా ।
కీర్తనజేతుప్రభూ శివలింగా ।
మా కర్తవునీవేగిరివాసాలింగా ।
ఆర్థినికావునమో హరలింగా ।
నమోహరలింగ । దరీనీవేలింగా ॥ జయ ॥

3. నీ సరిలేరు నమోఇష్టలింగా । నాదరినీవేనమో ।
ప్రాణలింగా । నీరూపుమదినిల్పునమోభావలింగ ।
నీదివ్యతేజమునమో ఆత్మలింగా ॥ నమో ॥
నమోదివ్యలింగా ॥ జయ శివలింగ ॥

4. విజయమునొసగు మావిశ్వేశలింగా । అజహరి
సన్నుత అమరేశలింగా । త్రిభువనపావన నమో
శివలింగా భజయించే రాజమౌళీ సదాశివలింగా ॥ సదా శివలింగా
మది నీవేలింగా ॥ జయశివలింగ ॥

## 10వ కీర్తన (తిరుముల మందిరాసుందరా)

పురహారశంభో శంకరా ।
గిరిధరలింగ భయంకరా । యే తీరుగనినుచేరేనురా
యేదారిగనిను గాంచేను రా ॥ పురహార ॥

1. మంచు కొండపైనిండు మనసుతో ।
మసలే మహాదేవుడి వో ।
అంచితంబుగాహాలాహాలముసు
గళముధాల్చినా గంగాధరుడివో
ముల్లోకములామృత్యువుబాపినా
మృత్యుంజయుడవు నీవేనయా ॥ పురహార ॥

2. భక్తులకొర్కై భువిలో వెలసినా
శక్తిప్రియుడవునీవే ।
ముక్తినొసంగవిశ్వములోన
సాక్షిరూపుడవునీవే
సర్వములోనా నిర్వికల్పమున
శాశ్వితుండవునివేనయా ॥ పురహార ॥

3. నీదరి చేర పరమే నీవై
నిలచినావాడవు గిరివాసా
నీసరిలేరని నిఖిలములోనా
నిజముగవేడితి హరఈశా ॥
సరగునరాజ మౌళి మదినేడబాయక
సవరించుము కృతిసర్వేశా ॥ పురహార ॥

## 11వ కీర్తన

దరినీవేరా ఈశ్వరా । నీసరిలేరుయిాలలోనా
కరుణించేదోరనీవే ॥దరినీవేరా ॥

1. అరమరశాయకు బిరుదు నీదేమరీ
పరమనేపదవికి, వరమునీదేసరీ
చరణము నమ్మితి ఓ పరమేశ్వరా
కరుణించియునను కాపగరావా ॥ దరివీవే ॥

2. సర్వమయుండవు సాక్షిరూపుడవు
నిర్వికారుడవు నిగమ వేధ్యుడువు.
పరమాత్మనిను ప్రార్థించేదమది.
మొరవినవేమయా మోక్షప్రదాయక ॥ దరివీవే ॥

3. నిగమాగమములు నీవే । నిఖిల కల్పమునీవే
నిగమాకోచరనీవు, వేగిరంబునగావు
అగణితంబుగ నిన్ను ఆరాధించితిచాల
తగువేలనాపైనతక్షణం బిటురావ ॥ దరివీవే ॥

4. సుస్థిరమైనావుహర శివనీవు
సురవర నరులను బ్రోచినాడవు
పరమపురుష ఓ పతిత పావనా
పంచకళా పుర పాపవిమోచనా ॥ దరివీవే ॥

## 12వ కీర్తన (ఈనాటి యీ హోమీ)

శ్రీ శైలమల్లేశ్వరా ! మముకారుణించు హరఈశ్వరా ॥ శ్రీశైల ॥

1. స్మరియింతురా మది పూజింతురా
మిము అర్చింతు అనుదినమూ
మురిబంబుతోనుదరిజేరినాను
వరమిచ్చిననుగావు పరమేశ్వరా ॥ శ్రీశైల ॥

2. మదినిన్ను కోరగ నీ కొండజేరగ
మా మనసంతో మురిసిందిరా
ఘనమైనరూపముగన్నానుస్వామి
గిరివాసనను బ్రోచి కరుణింపరా ॥ శ్రీశైల ॥

3. కనుకొంటిగా నేచెవివింటిగా
నీ ఘనమైన చరితము మదిగంటిగా
తెలియనులీలా పులిచర్మచేలా
కలలోన కనుగొంటికాల్యాణధామా । శ్రీశైల ॥

4. భ్రమరాంబ దేవిని వరియించినావూ
శ్రీశైలగిరియందు స్థిరమొందినావు
శతకొటిదండాలు శివ శంకరా
శంభోస్తుతియించిగా మాకు శుభమాయె । శ్రీశైల ॥

5. ప్రమదాదులంతా మిము గొల్చినారూ
భ్రమచేత భక్తులు భజియించినారూ ।
భూరిజనసేవితాలోక పరిపాలకా
కోరి రాజమౌళి మదిలోన మిముపీడకా । శ్రీశైల ॥

## 13వ కీర్తన (పగలే వెన్నెలా)

భోళాశంకారా భక్తవశంకరా
చాలగనుమాయెడనుజాలిగాంచరా ॥ భోళా ॥

1. యేలరావు మాదరికి ఫాలలోచనా
కాలమేమోకలుషహారణఫణిభూషణా
ఏ వేళ్లగొలచితినీ యేప్రొద్దు దలచితినీ
యుల్లమందు నీసేవా చేయలేనా ॥ భోళా ॥

2. పరులను వేడలేను పార్వతిరమణా
మరువలేను నీ భజనను మల్లికార్జునా
నీసరిలేరురా పురహార శంకరా
సరగునను నాదరికి చేరరావా ॥ భోళా ॥

3. భక్తుల మొర వినలేవా భర్గదేవా
శక్తికొలదిసేవజేతుశైలవాసా
ముక్తినినొసగరా కర్తవునీవేరా
భుక్తిశక్తి భక్తిముక్తియంత నీదేరా ॥ భోళా ॥

4. యించుకైనదయలుంచి పాలించిరా
పంచకళా పురనాథగాంచిబ్రోవరా
యెంచగరానిది మించినదొరకనిదీ
అంచితముగమీ కృపను యుంచరా దా ॥ భోళా ॥

## 14వ కీర్తన

హే శాంభవి మనోహర చెంద్రశేఖరా

భక్తవత్సలా భువనమదుసంచారా

ఓహో భక్తవత్సలా భువనమందు సంచారా ॥ హే ॥

1. నీవులేక జగము లేదు నిఖిలములోనా

నీలకంఠ దిక్కునీవేకలకాలములోనా ॥ హే ॥

2. గంగధరకావరా ఓ జంగమదేవా

అంగుగ మాకాధారము గంగయేకాదా॥ హే ॥

3. పన్నగేంద్రమీకంటెమిన్నలేరుగా

అన్నపూర్ణ సతియేమాకు కన్నతల్లిగా ॥ హే ॥

4. పంచభుతములలోనయెంచగనీవే

పంచకళ పురనివాసాపాలన నీవే ॥ హే ॥

## 15వ కీర్తన (పిలువకురా అలుగకురా)

పరమేశ్వరా జగదీశ్వరా

మొరలనువినరా గిరివాసా

దొరవని నమ్మితి హరమిశా ॥ హే ॥

1. కలలోనిన్ని మరువనుదేవా

పలుకవదేలా అలుకయిదేనా

కొలచిన మీదు కరుణ రాదానాపైనా ॥ పరమే ॥

2. ఖ్యాతిగనన్నేలు ధాతవునీవే

పాతకములు బాపేప్రభుడవునీవే

సతతము మిదూస్మరణ మరునజాలనురా ॥ పరమే ॥

3. తరుకని భాగ్యము అరుదుగా నీవని

శిరులనునొసగేబిరుదాంకుడవని

సరగునా రాజమౌళీ మొరవినిరావా ॥ పరమే ॥

# 16వ కీర్తన (జగదభిరామశ్రీ)

జగములనేలే జగధీశుడే
ఈ జనులరక్షించు పరమేశుడే ॥ జగ ॥

1. పగబూని మాపైన పంతము దాల్చక
వగచేత మము బ్రోవుజగదాంబప్రియరమణా ॥ జగ ॥

2. పాలవారధిలో హాలాహలమున
గళమునదాల్చిన గంగాధంరుడే
సలలితముగ మాకలత దీర్చినా
నీలకంఠేశ్వరనిఖిలాధారా ॥ జగ ॥

3. బాలడైన మార్కండేయునిగనీ
చల్లగబ్రోచినలీలావతారునీ
యెల్ల వేళల గాంచినాను మది
పాలలోచినపన్నిగ భూషణా ॥ జగ ॥

4. సురనర మొరలను సరగునచేకొనీ
దరికిజేరినధర్మావతారునీ
నిరతము నీపద ధ్యాన్నముచేసిన
దర్శినమియ్యర ధవలాంగా ॥ జగ ॥

5. అంచితముగమీ అద్భుతరూపం
ఎంచగాను సదాపరమ ప్రకాశం
గాంచినాము మీ కరుణామృతమున
పంచకళాపుర పశుపతినాథా ॥ జగ ॥

## 17వ కీర్తన

దేవాదిదేవా ఓ మహేదేవా
ఆదివినీవే అంత్యమునీవే
యీ అందాల సృష్టికి దైవమునీవే ॥ ఆదివి ॥

1. కృతయుగంబు నందు శ్రీహరియునిన్నెముందు
స్థిరభక్తితోడయుందు నేత్రమర్పించగవేడా
చక్రమొసగినవాడ. ॥ ఆదివి ॥

2. త్రేతయుగమునందు శ్రీరాముడే మీపొందూ
సముద్ర తీరమందు, పూజ సలుపగలేదా
లంక తేరెను కాదా ॥ ఆది ॥

3. ద్వాపార యుగమునందూ
ద్వారక వాసుండిందూ
సుధామపురమునందూ
సంతాతి కోరె లేదా సద్భక్తితోడ ముందూ ॥ ఆది ॥

4. కలియుగాన నరులు నమ్మి
కాశిలోన శివ మిమ్మొ చాలవేడిరి కాదా
ఫాలలోచనదేవా ॥ ఆది ॥

5. యుగయుగాన మిముగొలచీ
జగములోన శివుని దలచి
నిగమగోచర నీవే
త్రిగుణ రూపుడవునీవే ॥ ఆది ॥

6. ధరలో పంచకళ వాసా
ధ్యాసమరువను యీశ
దయా మయుడవునీవే
ధర్మ ప్రభుడవునీవే ॥ ఆది॥

## 18వ కీర్తన

శంకర మీస్మరణమూ ।
యిది హంకారమణ గించే ఆనందగీతమూ ॥ శంకరా ॥

1. నారదాదిమునివరులు కొందరు
గానముచేసిరి మానసమందునా
స్థిరముకాను శ్రీగౌరీనాథుని
స్మరణచేత సుఖసౌభాగ్యమే ॥ శంకరా ॥

2. పావన మీచరణమూ
పరమానందభరితామూ ॥ పా ॥
పతితులకెల్లను పరమపావనం
హే పరమేశ సంపూరిత మధురం ॥ శంకర ॥

3. నేనును చుండెడి హంకారమూ
దీని విడచియుండుటె శ్రీకారమూ
తిన్నాగాను మీ ఓంకారంబుచే
సున్న యగును ఈ దురితాహంకారమూ ॥ శంకర ॥

4. కోరితిమీపద కైవల్యము । చేకూరెను కరుణా రసమూ
కురిపించర ఒకరి చర్మాంబర
హరహర శంకర ఆదరించరా ॥ శంకర ॥

5. వాసిగాను మీ దాసునిమొరవినీ
పోషించుముసదా ధ్యానమరువక
దాసిలోగ్గియును రాజమౌళి ఇక
ఆశించెనుస్థిర ఆనందమునకూ ॥ శంకర ॥

## 19వ కీర్తన

నమో పన్నగేంద్రా గిరీంద్రా
నమో సుగుణ సాంద్రా
అమోఘమగు మీ అద్భుత చరితము
అఖండ విజయము ఆ వనిలో జనులకు ॥ నమో ॥

1. కాలమేమో యీ కలి జగమందునా
చాలగవేడినా జాలిజూపవు
నీలకంఠ మీచరణమునమ్మితి
యేల రావు మా మొర వినవేమయా ॥ నమో ॥

2. భక్తితోడ మిము భజియించితినీ
శక్తితోడ మిము పూజించితినీ
ముక్తి మార్గమును ముదముతో గంటినీ
అవ్యక్తరూప శివ శరణంటినిరా ॥ నమో ॥

3. లాలన పాలన ల యకర్తవు ఇలా
చాలగ లీలలు చేయుచునిలలో
ఓలలాడితివి ఓ ధవలాంగా
పాలముంచి నా నీ లముంచినా నీవేరా ॥ నమో ॥

4. పంచకళాపురవాసుడ నీవనీ
సంచిత పాప వినాశుడ నీవనీ
గాంచి మ్రొక్కితిని గజచర్మాంబర
దీవించరా నను దీన శరణ్యా ॥ నమో ॥

## 20వ కీర్తన

తడవేలరా శంకరా యింక
తడవేలరా శంకరా
యెడబాసి మదిలోనా
ఘడియైన నోపరా పుడమిలోమీసేవ
విడువాజాలను దేవా ॥ తడవేలరా ॥

1. అడియాసజేయకురా ఘడియలోరావేరా
బిడియము నీకేలా । బిరుదునీదేమరి
పరుగిడి రావేరా । పాలాక్షహరా
కడసారి ననుగూడి । కడతేర్చుటకుజేర ॥ తడవేలరా ॥

2. పరిపరి విధముల ప్రార్థనజేతురా
పంతమానామీద పతితోద్ధారా
పరుగిడి రావేరా పురహర శంకరా
ప్రారబ్ధ మేమిటో పలుక వదేరా ॥ తడవేలరా ॥

3. వరపంచకల పురిలో వెలసిన దేవా
కరుణించిదాసుల మొలవినిరావా
కరిచర్మాంబరకావగరావా
దర్శన భాగ్యము దయచేయుమిరా ॥ తడవేలరా ॥

## 21వ కీర్తన

నిన్నే నమ్మితి ఓనీల కంఠ మహదేవమదిలో ॥ నిన్నే ॥
యెన్నరాని మీపాద పద్మముల
సన్నుతించేదను కన్నడశాయకు
తిన్నగాను మీకన్నమిక్కలి
పన్నుగలేరని పార్వతీశహరా ॥ నిన్నే ॥

1. కరుణాజూపరా । ఓ సాంబసదా శివా ॥ కరు॥
అరమరలేకను సరగుననీవునా
దరికి జేరి మా కోరిక దీర్చరా
దురిత విమోచన ధీన శరణ్యా
పరమ పావన పాతక హరణా ॥ నిన్నే ॥

2. యుల్లామందునా ఓ ఫాలలోచనా
పాపవినాశా ॥ యుల్ల ॥
ఉల్లాసముగను యెల్ల వేళ్లలా
తల్లి పార్వతి తనయులతోమది
యెల్లకాలములో కొలచేదాముహర ॥ నిన్నే॥

3. మరువాలేముగా మీకరుణచేత
మమ్మేలేడి ప్రభువనీ ॥ మరు ॥
కారణమైన యీ కర్మములన్నియు
దూరము జేయుటభారమీవేయని
మొరలిడుచుంటిర మృత్యుంజయహర ॥ నిన్నే ॥

4. గాంచియుంటినీ మీచరణకమలముల
మరువకానుసదా ॥ గాంచి ॥
యెంచగాను సదా యెకాంబరుడని
పంచకళాపురి వేంచేగా సితిరని
మింటినవాడవు ఓ పరమాత్మా పావనచెరితా ॥ నిన్నే॥

## 22వ కీర్తన (తెలియగలేరనీలీల)

తెలియగ తరమా నీలీలలూ
యీకలిజగమందునా పామరులూ ॥ తెలి ॥

1. యేల రాదుయీజనులకు నీయెడ
కాలమేమొ మీ భక్తి బూనరిల
కల్లగాదుయీ కలిజగంబునా
యుల్లమందు నా పల్లవ పాణీ ॥ తెలి ॥

2. ఆదిశక్తినీ అర్ధాంగిగగోనీ
మేదినిలోన కర్తవు నీవనీ
ఆదిమూర్తివటంచుకొందరు
అరుదుగ మీకీర్తనలు జేతురిలా ॥ తెలి ॥

3. ఆదిలోన శ్రీహరియు అజుడునూ
మేమధికులమని మేదినిలోన
పాదుగాను మహాపంతముబూనియు
క్రోధంబుచేఘన యుద్ధముసలుపగా ॥ తెలి ॥

4. ఆసమయంబున అజుడు శస్త్రమును
అదిగని శ్రీహరి చక్రము వదిలెను
దండిగాను రెండస్త్రంబులను అండజేర్చు
కొనియుండినదేవా ॥ తెలి ॥

5. అహము వీడి యాసురాగ్రేసరులూ
ఆయుధములకై వెదకుచుండిరిల
అంతలోనే మహాఘనలింగముగని
సంతోసబునా పూజ సలిపిరటా ॥ తెలి ॥

6. ఆవేళ్లలో హరిబ్రహ్మాదులును
అహోరాత్రులు తపమొనరించెను
ఆదిమూర్తిశివదర్శన మీచ్చేను
ఆదినమే శివరాత్రియటంచునూ ॥ తెలి ॥

7. క్షితిలోనా మీదీక్షనుచేకొనీ
తక్షణముగ మీదాసులమే మనీ
కక్షయేల యీక్షణంబుమాయేడ
శీక్షవలదు మీ మోక్షపదంబునూ ॥ తెలి ॥

8. మంచుకొండ పైమహాదేవుడుసదా
సంచరించుచూ ఇలపైచేరేకదా
అంచితముగయా పంచకళేశునీ
కించిత్ మరువకగాంచన వారికి ॥ తెలి ॥

## 23వ కీర్తన (బృందావనమది)

శంభోశంకర గిరిజ మనోహర
నిన్నేనిమ్మితిరావాయ్యా ॥ శాంభని ప్రియుడవు నీవయ్యా ॥
యీజగతిలో సర్వము నీవయ్యా ॥ శంభో ॥

1. దివ్యరూపడవునీవయ్యా
యీదీనునికావగరావయ్యా
దీక్షతోడనిను కొలిచేమయ్యా
మాదిక్కునీ వెయని వేడుదుమయ్యా ॥ శంభో ॥

2. సర్పధారివి నీవయ్యా
శాంతరూపడవు నీవయ్యా
సకలలోకములో నిండినదేవా
సరగున మమ్ముకావగరావా ॥ శంభో ॥

3. నటరాజశేఖర నీవయ్యా
నిటలాక్షహరరావయ్యా
కుటిలములేకనే నీవయ్యా
తృటిలో మామొరవినవయ్యా ॥ శంభో ॥

4. అష్టమూర్తివి నీవయ్యా
దృష్టాంతంబేగదనయ్యా
దృష్టినిల్పిశ్రీరాజమౌళిసదా
నిష్టచేత నిను గొలచేగదా ॥ శంభో ॥

5. వాసిగ పంచకళపుర ఈశ్వర
ధాసులపోషించగరావా
దీక్షతోడమీస్మరణ మహేశా
మోక్షంమొసగును పరమేశా॥ శంభో ॥

## 24వ కీర్తన (పరమ పావనదీన)

శివహర మీచరణస్మరణము
మరువకను ధ్యానింతురా
సరుగునా మమ్మేలేదౌరవనీ బిరుదుదే శంకరా ॥ శివ ॥

1. పొందుగా మీముందిజేరితీ
నందివాహన ఈశ్వరా
యందుశేఖర మీదు కృపనూ అందజేయుము ముందుగా ॥ శివ

2. పంతమేల పార్వతీశా
సంతసంబునానేలరా
యెంతగానో కోరితిని నా చెంతజేరియుకావరా ॥ శివ ॥

3. భక్తుడైన భానునింటాకొలువుచేయగదేలర
శక్తిప్రియుడవు ముక్తిదాతవు విరక్తిజేందక
నేలుమా ॥ శివ హర ॥

4. పాలవారిధిలోనవిషమును
మేలనిసేవించగా
నీలకంఠనిఖిల సురలను జాలిచేరక్షించగా ॥ శివ హర ॥

5. రమ్యముగ మీపుణ్య చరితము
ధన్యునిగచేకూర్చేగా
అన్యునిగమదియెంచబోకూ
చిన్నిరాజమౌళినీ ॥ శివ హర ॥

## 25వ కీర్తన

కైలాసవాసా ఈశా మముకావుము సర్వేశా
కాపాడుము జకదీశా, కరుణించుము పరమేశా ॥ కైలాస ॥

1. పాలించువాడ నీవే పరమాత్మనీవుదేవా
మాప్రార్థనవినలేవా ఓ పార్వతీశరావా ॥ కైలాస ॥

2. అఖిలంబునందునీవే నిఖిలంబునందులేవా
ఆనందమూర్తిరావా । మమ్మాదరించి పోవా ॥ కైలాస ॥

3. దండివాడవనుచూ । నీ యండజేరినిలచీ
నిండూగమదిలోదలచీ చండీశ్వర మిము పిలచీ॥ కైలాస ॥

4. నీభక్తుడానుదేవా । మీ శక్తితోడరావా
మాకీర్తినిలుపలేవా । కర్తావు నీవే గావా ॥కైలాస ॥

5. పంచకళాపురమందు । ప్రబలించినావుముందూ
మించీన మహిమయందు ఎంచాగనీవేకందూ ॥కైలాస ॥

## 26వ కీర్తన (నీవుండెదాంకొండ)

శ్రీవీరభద్రేశ్వరా ఓ దేవా పంచకళాపురా
ఈశ్వరా । నీకరుణా వెదజల్లరా నాస్వామి ।
మరువకమిముదలతురా ॥ శ్రీ వీరభద్ర ॥

1. భక్తులంతమిము జేరి భక్తిచేత మిముకోరి
శక్తియైనభద్రకాళీ చెంత జేరికడసారి
భక్తితోని పూజజేసి బహువిధములనర్చింతుము ॥ శ్రీ వీరభద్రేశ్వరా ॥

2. నదిలోనస్నానాలు మదినిండుగాజేసీ
వదలాకాను నినుజేరి కదలకుండ కొనియాడి
మహాదేవాపుత్రయంచు
మరిమరీదలచెదారు ॥ శ్రీ వీరభద్రేశ్వరా ॥

3. శివరాత్రి దివసమునా శివపుత్ర మీముందు
శోభనముగ యాత్రజరుప చోద్యముగ భక్తులిందు
వాధ్యాబృందములచేత వేదావేధ్యులంతకొలచీ ॥ శ్రీ వీరభద్రేశ్వరా

4. నిక్కముగమిముజేరి మ్రొక్కెదరు మిముకోరి
నీకుదెచ్చినీ ముడు పుల్ నీకర్పణముజేసి
చక్కగదీవేనులిమ్మని మక్కువతో జనులంతా ॥ శ్రీ వీరభద్రేశ్వరా ॥

5. మరువరానిదీక్షేత్రం మహాపుణ్యమీతీర్థం
మహాత్ముడైన నిరంజనుడు మహిమతోడనిల్పిరటా
మాన్యులారా వేడరయ్యా మనజన్మకు పుణ్యమయ్యా
॥ శ్రీ వీరభద్రేశ్వరా ॥

## 27వకీర్తన

దేవుడెపుడు దీనులయెడ దయాపరుడే
పుడమిలోన నమ్మేవారికి దిక్కుదేవుడే ॥ దేవు ॥

1. కలడు శివుడు కలకాలము కారణాత్ముడై
కదలకుండుకాపాడును నీలకంఠుడె ॥ దేవు ॥

2. సకల శాస్త్రములయందూ సత్యమునీవే
సర్వకోట్ల జీవులందు నిత్యమున్నావే ॥ దేవు ॥

3. నేన్నదివిడచి మదిలో నిన్నేగొలచినా
నీలకంఠ నిఖిలములో నిలతువుకానా ॥ దేవు ॥

4. ఎందరినో రక్షించిన నందివాహనా
వందనములు మీకు జేతు భక్తచందనా ॥ దేవు ॥

5. సంచితకర్మలు బాపేసదయుడ నీవే
పంచకలపురమున పరమేశుడ నీవే ॥ దేవు ॥

6. ధాత్రిలోనరాజమౌళీ గాత్రమునీదే
మీ పుత్రులలో పాత్రునిగాచేకొనరాదే ॥ దేవు ॥

## 28వ కీర్తన (రారా క్రిష్ణయ్య రార)

ఉ ॥ దాసలను కాపాడుటకు దేవుడున్నాడు
ఆదేవుని నమ్మినవాడుయెన్నటికిచెడిపోడు
ఆపదలుదీర్చేటి ఆనంద మయుడే ఓ మనసా॥
దేవా విశ్వేశా, దేవా విశ్వేశా, దీనుల కాపా
డరావా విశ్వేశా ॥ దేవవి ॥

1. యిష్టముతో యీజగము నేలుచుడివీ
అష్టమూర్తివైజనులముందునిలచియుంటివి
సృష్టిలోన మిమహిమలు తెలసి యుంటిమీ
దృష్టినీదేశంభో, నిష్టనిలుపర శంభో ॥ దేవవి ॥

2. బాధలులేకుండ జేసేభవుడవునీవే
వ్యాధులరాకుండజేసే వైధ్యుడవునీవే
పాదుగానువేద శాస్త్రమందున నీవే
నీవేలింగా నీవేలింగా ॥ దేవవి ॥

3. త్యాగులకు భోగులకు యోగ్యమునీవే
యోగులకు యోగ్యులకు మోక్షమునీవే
జ్ఞానాప్రజ్ఞానములకు ప్రభువుజనీవే
నీవేశంభో నీవేశంభో ॥ దేవవి ॥

4. వారణాసిపురములో వేలసియున్నావు
కూరిమితో దాసుల దరిజేరియున్నావు
పారవారము గానీవే పార్వతిరమణా
రారా శివ రారా శివ ॥ దేవవి ॥

5. హర హర నా మొరవినవాగిరిజారమణా
శరణ నీకుజేతునయ్య పరమపావనా
రయముగాను రాజమౌళీ మనమునందునా
నీవే శంభో నీవే శంభో
॥దేవా విశ్వేశా దేవా విశ్వేశా ॥

## 29వకీర్తన (నాదరిగనవా నా మొరవినవా)

నామదిగనవా మామొరవినవా
మదినమ్మితి నిన్నే ఈశా
యికస్మరణము నీదే మహేశా ॥ నామదిగనవా ॥

1. కదలక నిను నేనయ్యా
వదలక తలచెదమయ్యా
కనుతెరచిననూ కను మూసిననూ
నా అండగనిలువగరాదే ॥ నామదిగనవా ॥

2. యెటుజూచిననూ యెటుగాంచిననూ
పటుతరముగయున్నావూ
హటయోగంబునా పటుతరంబునా
నిటలాక్షుడవు నీవే ॥ నామదిగనవా ॥

3. జపతపంబుములనుజేసెదనయ్యా
కృపతోడ నను గావుమయ్యా
ఎటుమెప్పెదవో దిటచేయుదువో
యీ దీనునిబ్రోపగరాదే ॥ నామదిగనవా ॥

4. శాశ్వితుండవు సర్వమయుడవూ
నిర్వికారుడవు నీవేనయ్యా
విశ్వమయుడవు విశ్వానాధుడవు
విశ్వేశుడవు నీవేనయా ॥ నామదిగనవా ॥

5. నిరతము వేడితినయ్యా
నీస్మరణ మరువనయ్యా
శరణ ంటినయా కరుణించుమయా
వర రాజమౌళీని మురిపించుమయా ॥ నామదిగనవా ॥

## 30 వ కీర్తన ( జననీ శివకామినీ)

శరణం గౌరీనాయకం శుభకరదాయకం
సురనర పాలకం ॥ శరణంగి ॥

1. మీస్మరనున్నా ఉరకుభయాలు మీకరునున్నా
వేరుచుబంధాలు ఇరవుగ మాకుతో నిలచీ
నిరతముబ్రోవుమి గిరిజార రమణా ॥ శరణం ॥

2. గానములో నా ప్రాణమునీవే
ధ్యానములోని జ్ఞానమునీవే
మానక నినునే మదినమ్మితినీ
కానరారా హర కరిచర్మాంబరా ॥ శరణం ॥

3. అక్షరరూపా సాక్షి స్వరూపా
సూక్ష్మ ప్రదీప సుగుణ కలాపా
ఏక్షణములో నీదీక్షలో యుంటునీ
రక్షణ సేయరా ఫాలాక్ష హరా ॥ శరణం ॥

4. ప్రమధాధీశా ఉమ హృదయేశా
ప్రణవ ప్రకాశా పరమాత్మయీశా
పంచకలేశ్వర ప్రస్తుతించితినీ
సంచితార్థములముంచబోకురా॥ శరణం ॥

## 31వ కీర్తన (ఘులు ఘలునగంతిడి రారా)

పాహి పాహి యనగ రారా పార్వతి రమణా
పరమపావనా ఓ పాపవిహరణా ।పాహి ॥

1. కరుణ జూపవయ్యా ఓఫాలలోచనా
మరువలేను నిన్ను సదా గౌరీ రమణా ।పాహి ॥

2. హృదయాసనంబులోన నీవుయుంటివిదేవా
హర్నిమిషమందు నిన్ను మరువలేను శుభావా ॥ పాహి పాహి ॥

3. అగణితంబుగ మీసేవచేయుచుంటినీ
త్రిగుణరూపుడుచువేగప్రణుతి జేసిదా ।పాహి ॥

4. వందనమిదే మీకుదేవ భక్తచెందనా
మీనందనునిగ చేకొనవయిందు భూషణా ।పాహి ॥

5. పంచకళ పురినిలయ పాపనచరణా
దీవించియు దీనుల పైయుంచుము కరుణా ।పాహి ॥

## 32వ కీర్తన

మీ దాసులకుభయమేలనయ్యా
నిఖిలాశ్రితహర నీలమహేశ్వరా ॥ మీదా ॥

1. జాగేలమీదాసుల బ్రోవగ
రాదేలమాదరికిచేరగా
సాగిలబడి మ్రొక్కెదాను శివ
నాగాభరణా గౌరీ రమణా ॥ మీదా ॥

2. రావెలా నాదుమొరవినగనూ
కావవేలసకల లోకపావనా+
నీచరణమేనా హృదయమునా
మరువకాను నిను నమ్మిన వాడను ॥ మీదా ॥

3. కావవేల మీకంటెరెప్పవలే
బ్రోవవేల మీవెంటనందివలే
పావనముగ జాగంట నాదువలే
సావధానమున సన్నిధిజేరగా ॥ మీదా ॥

4. భూతేశ మీ భక్తుల కెన్నిడు
భీతిలేదు మీ చరణము నమ్మిన
ఖ్యాతిగాను మాధాతవటంచును
ప్రణుతిజేతుమిక పంచకలేశ్వర॥ మీదా ॥

## 33వ కీర్తన

అంబజగదంబ మీకు వందనమమ్మా
కుంభీనిలో భక్తులంతా గొలుంతురు సుమ్మా ॥ అంబ ॥

1. యుగయుగానసురులు మిమ్ము గొలచినరమ్మా
గొలచినట్టి సురులను రక్షించినవమ్మా
రక్షించినవమ్మా సాక్షినీవమ్మా ॥ అంబ ॥

2. జగమంతట నీశక్తి యెనిలచనోయమ్మా
యోగులంతనీ భక్తియే సలిపినరమ్మా
సలిపిలనరమ్మా, నిలిపినరమ్మా॥ అంబ ॥

3. నీరూపమును జూడ మాకు నలవిగాదమ్మా
అపురూపమును జూపి మమ్మాదరించమ్మా
ఆదరింతమ్మా మాబాధ దీర్చమ్మా ॥ అంబ ॥

4. మంత్రసిద్ధులంతా మిమ్ముదలతురోయమ్మా
మాయగాంద్ర విధ్యలందునిలచినవమ్మా
నిలచినవమ్మా పలికినవమ్మా ॥ అంబా జగదంబా ॥

5. గుడియెదుట వైభవములుజేతుమోయమ్మా
ఆడిపాడుచున్నభక్తజనుల అండనీవమ్మా
అండనీమ్మా యుండుమోయమ్మా ॥ అంబ ॥

6. దాసులంత మీకు పూజ జేతురోయమ్మా
భాసురముగ వారిని దయజూడ మాయమ్మా
దయజూడ మాయమ్మా అభయంబునీయమ్మా ॥ అంబ ॥

7. అంచితముగ వరములిచ్చినేలుమోయమ్మా
పంచకళ పురవాసుల ప్రార్థనవినుమా
ప్రార్థనవినుమా ఈ కీర్తనగనుమా ॥ అంబా జగదంబా ॥

## 34వ కీర్తన (శంకరా నాద శరీరహరా)

ఈశ్వరా సాశ్వితుడవునీవేరా
యీ సమయమునను గావరా
శంకరబ్రోవరా ॥ ఈశ్వరా ॥

1. ధ్యానమేనీదని యోగమే నీవనీ
యోగమే(ప్రాణమనీ
నీవేదిక్కని నిరతముకొలచిన
నీదాసుడనూనేనైతే
ఒక్కసారికనుపించరా, మాదిక్కునీవేయనియంటిరా
మక్కువతోడను సాక్షిరూపమున
గోచరించరా, అవతరించరా, గనితరింతురా ॥ ఈశ్వరా ॥

2. పలుకే పలుకువు పిలచే పిలుపువు
కదిలే మనసువు కాబోలూ
వెలగే వెలగువు చెలగిన తేజము
గాంచిన రూపము కాబోలూ
చిద్రూపమునచూడంగా
సాదృశమాయెను ధవలాంగా
భద్రముగనునే నిలువంగా
దృశ్యంబైతివి భవభాంగా ॥ ఈశ్వరా ॥

3. పంచాక్షరములు పంచభూతములు
పంచప్రాణములు కాబోలూ
అంచితముగనుసంచరించెడి
పంచజ్ఞానములు, కాబోలు, పంచిచూడగను పరగంగా
పంచికళేశునిచూడంగా
పరమాత్మనీవేయని పలకంగా ॥ ఈశ్వరా ॥

## 35వ కీర్తన (యిందుశేఖరయిందుశేఖర)

చెంద్రశేఖరా, చంద్రశేఖరా గావరా ॥ చెంద్ర ॥

1. నంది వాహన నాగభూషణ
వందనముచేకొనుమురా
ముందుగ మీ పూజచేయుచు
మోదమొందితి ఈశ్వరా ॥ చెంద్ర ॥

2. దండి గనుప్రమదాది గణములు
అండజేరియు కొలవగా
ఎండవానల కోర్చినీవిక కొండపైన నివాసమూ
నిండుమనసుతో ఉండుటకు నీమొండి తనమే మానుమూ॥ చెంద్ర ॥

3. బుసలు గొట్టె కాలసర్పము భూషణముగదాల్చియూ
వసుధలో చరియించుటకు మీ వాహనంబే వృషభము
దాసరక్షణచేయు వాడవు ధరణిలో దయామయా ॥ చెంద్ర శేఖరా ॥

4. పక్షివాహన సఖుడ్పైయుసల భిక్షమెత్తుట న్యాయమా
అక్షయముగా అన్నపూర్ణ సతియే సాక్షిగయుండగా
యీక్షణంబే దీక్ష భూనితి । లక్షణంబుగ
రావయ్యా ॥ చంద్రశేఖర ॥

5. బ్రహ్మ విష్ణుసురలు యక్షులు బాగుగా ప్రణుతించిరీ
భోళాశంకర బిరుదునీకది చాలగ కొనియాడిరీ
సంబరముగ రాజమౌళికి శుభంబునొసగియు
గావరా ॥ చంద్రశేఖర ॥

## 36వ కీర్తన

యెందుకురా యీజన్మం నరుడా,యెందుకారా ఈ జన్మం
ముందుగాను మహాదేవునీ నామం
పొందుగతలువనీ మానవ జన్మం ॥యెందు ॥

1. పెద్దలుచెప్పిన వాక్యంబులు గనీ
ముద్దుగ వినకను మొద్దులవలె నిలా
బుద్ధి హీనులైదిరిగేడి వారికీ ॥యెందు ॥

2. ధనమధాంధమున ధన్యుడననుకొని
దానధర్మములు దనురుగచేయక
ధర్మహీనులగు దుర్మార్గులకునూ॥యెందు ॥

3. మంచివాడని మురువకురా
యెదిరించి వాదములుచేయకురా
మద మత్సరములు, మరిగిన నరునికి ॥యెందు ॥

4. వాసిగానునిల పంచకళేశునీ
అంచితముగ శివపంచాక్షరినీ
వాంఛతోడ పఠియించని వారికీ ॥యెందు ॥

## 37వ కీర్తన(నిత్యాన్నదాతవు నీవులే)

ఓ ఓ..........ఓ గిరిజా సుందర నాథశంకరా
సరిలేరునీకురా । మురింపంబు గన్నమదిమిన్నిరా ॥ ఓ గిరి ॥

1. జగతియందున జగదాంబతోని జనుచునుంటివి
జలధారతీరు । జగమునందున జగధీశనిన్నే
జన్మ జన్మకునిను మరువలేను. ॥ ఓ గిరి ॥

2. కలతలేకను కలకాలమందునా
కొలచి యున్నాయిల భక్తులకునూ
కలలో నైనను కాపాడుచంటివి
కరిచర్మాంబర కోరివేడితిరా ॥ ఓ గిరి ॥

3. దేహ వాసన మోహాలువిడచీ
విహితముగనువిషయాదుల నచీ
సాహసంబున అహమును విడచినా
యిహ పరములకై ఈశ్వర కృపనీదే ॥ ఓ గిరి ॥

4. పూర్వ జన్మలాపుణ్య వశంబున
పొడగాంచితినిను పరమేశా
ప్రీతితోను మీ ప్రణవాక్షరమును
పఠియించితిరా పంచకళేశ్వరా ॥ ఓ గిరి ॥

## 38వ కీర్తన

నా మొర వినవేమయా। రాజేశ్వరా॥ నామొర॥
నా మొర వినవేమి। నను దయ గనవేమి
మరువక నినునే। మది నమ్మితిరా ॥నామొర॥

1. ధ్యాన్నముచే నీ దరికి చేరితినీ
దయతోడను నను దీవించుమురా ॥నామొర॥

2. కోపమెందుకు దేవా। దాపునీవైయుంది
కాపాడి నన్నేలు కాత్యాయణీప్రియా ॥నామొర॥

3. కామసంహరనాకు। క్షేమంబొసగియు
కైవల్యమార్గము కటాక్షించమేమయా ॥నామొర॥

4. భక్తుల పాలిట భవుడవునీవని
నాశక్తిచేత నీ భక్తి సలిపితినీ ॥నామొర॥

5. దాసుడు రాజమౌళి ధర్మముదప్పక
నిర్మలభక్తి చే నిను స్మరియించగా ॥నామొర॥

## 39వకీర్తన

నమ్మితినయ్యా ఉమామహేశ్వరా
సమ్మతితోడను సరగున.బ్రోవరా ॥ నమ్మితి ॥

1. తల్లి తండ్రివి గురుడవునీవనీ
ఎళ్ళవేళ్ళలా ఏలుచుంటివనీ
జాలమేల నీ పాల బడితినిక
భోళాశంకర బ్రోవవేమిరా ॥ నమ్మితి ॥

2. ఉమాదేవితో హిమగిరిపైనా
రమనీయంబుగ విహరించితివా
క్రమముతోడ మీవ్రతము జేసితినీ
శ్రమలు రావుయని శ్రద్ధతో మ్రొక్కితినీ ॥ నమ్మితి ॥

3. పంచముఖంబుల పరమేశుడవనీ
పంచక్షరముల ప్రభలినాడవనీ
పంచభూతముల ప్రపంచమందున
ప్రాకటుంబుగ పరగవెలసితివీ ॥ నమ్మితి ॥

4. నాదు బిందుకళ నటున రూపుడవు
ఆదివిధ్యలకు వేదవేధ్యుడవు
ఆగమ నిగమా అంత్యము నీవనీ
యోగముగను శివయోగమునీవనీ॥ నమ్మితి ॥

5. అజహరిసురలెల్లా అమరులాదిగలా
భజయించియు సదా విజయము బొందిలా
నిజముగాను మీభక్తి మహత్యము
విజయమునొసగెను రాజమౌళికినీ ॥ నమ్మితి ॥

## 40వకీర్తన (ఎచ్చోటనునానవో శ్రీ గురుదేవా)

ఎచ్చోట నున్నావో శ్రీ పార్వతిశా
మాచోటికిని నీవు మరి జేరరావా
ఎచ్చోట గలవనుచూ నెచటికేగెదనూ
ఏచోట లేవనుచూ ఎడబాయలేనూ ॥ ఎచ్చోట ॥

1. అంతాట నున్నావూ అనంతారూపా
వింతామాయలనెల్లా విరవిగానొప్పా
ఆధ్యాంతముల యందు అలరీనావయ్యా
ఆదర్శ మూర్తివై ఆదుకొనవయ్యా ॥ ఎచ్చోట ॥

2. పిలచీన పలుకావూ పరమేశనీవూ
చెలనంబులేకీనే శిలవయ్యి నావు
పలుమారు మిస్మరణ పలుగంగాకోరీ
అలుగూట తగదయ్యా ఆనందమూర్తీ ॥ ఎచ్చోట ॥

3. మధిలోన నిన్నెపుడు మరువాలేనయ్యా
అనుమాన మెందులకూ కనుకొనవయ్యా
తనుమాన బుద్ధియు నీవెగదయ్యా
నేనున్నా కానుగా చేకొనవయ్యా ॥ ఎచ్చోట ॥

4. సర్వాత్మకుండవై సర్వేశ నీవూ
నిర్వాణ పదవిలో నిలచీయున్నావూ
కూర్మీతో ఈ జగము కల్పించినావూ
కారణా రూపడవై కడతేర్చనీవూ ॥ ఎచ్చోట ॥

5. పంచకళా పురమందూ వేంచెయవయ్యా
చెంచాల మును మాని చిరకాలమయ్యా
మంచీ భక్తులపొందు మరువా బోకయ్యా
మురిపంబుచేమాకు మోక్షమొసగయ్యా ॥ ఎచ్చోట ॥

## 41వ కీర్తన (పచ్చబొట్టు చెదరిపోదులే)

నిశ్చయంబుగ నిన్నే మరువనూ నాస్వామి
నిమిషమైనా నిన్నూ విడువనూ నా స్వామి ॥ నిశ్చ ॥

1. ఎల్లలోకములకేక నాధుడవు
తెల్లవృషభము నెక్కినవాడవు
చల్లగ భక్తుల ఏలిన వాడవు
ఉల్లాసంబుచే ఉమామహేశ్వరా ॥ నిశ్చ ॥

2. కలలో నిన్నే మరువను దేవా
కలకాలంబున కరుణా జూపవా
కాలకందర కలుష విమోచన
కైవల్యంబును కటాక్షించరా ॥ నిశ్చ ॥

3. ప్రాణములోనా ప్రాణమెనీవై
ధ్యాన్నములోనా జ్ఞానమునీవై
వేదవేధ్యవేదాంత స్వరూపా
ఆధ్యంతమున ఆదిమూర్తివే ॥ నిశ్చ ॥

4. సాటిలేని ఇలమేటి దేవుడవు
ఆటాడించెటి హటకేశ్వరుడవు
సూటిగాను మీ బాట విడువకను
మాటి మాటికిని మేటి పదవికై ॥ నిశ్చ ॥

5. నేటుగాను త్రికూటమునందున
పాటిగాను పరికించి చూచితే
చోటు చేసుకొని కోటితేజమున
ధీటైయున్నది దివ్య స్వరూపము ॥ నిశ్చ ॥

6. వాంచ దీరగను గాంచినాను శివ
అంచితమైన ఆనందంబుచే
సంచరించుచును. సకలములోన
పంచకళాపుర మెంచినావులే ॥ నిశ్చమంబు ॥

## 42 మంగళహారతి

మంగళం శ్రీగణ నాథా జయమంగళం శ్రీ విఘ్నదాతా ॥ మంగళం ॥

1. మంగళంబులు నీకు మహిలోన జనులంతా
పొంగుచును నిచ్చెదరు అంగణా మణులంతా ॥ మంగళం ॥

2. అన్ని పూజలకంటె మొదలు మిమ్ముపూజించెదరు
హరిహరులు, పన్నుగను మీ మహిమవిన్న
వారలకును ॥ యెన్నెన్నో విఘ్నాలు సున్నయగు
నని మీకూ ॥ మంగళంబు ॥

3. భాద్రపదశుద్ధ చవితీ భక్తితో నిలుపెదరుధాత్రీ
శక్తితో చేయుదురుకుడుము లుండ్రాళ్ళను
భక్తులంతా మిమ్ము భళి భళి భళియని గొలచీ ॥ మంగళంబు ॥

4. మూశకాసురుని వధించీ భాసురంబుగసురల గాంచీ
భీతీతోనున్నట్టి సురల రక్షించినా
అంబ పుత్ర మీకు శుభ మంగలంబనీ ॥ మంగళంబు ॥
5. దేవతా గణములునిన్నూ భావంబులో దలచియిందు
కేవలంబుగా సదా ధ్యానించుమును మదిలో
సావధానంబుచే స్వామిసన్ని జేరి ॥ మంగళంబు ॥
6. గజముఖ పదన మిము దలచీ మీ భజన దప్పను సదానిలచీ
రాజమౌళీ కృతిని విజయంబు గావించి
సుజునులంతా గలసి శుభ మంగళంబని ॥ మంగళంబు ॥

## 43. మంగళహారతి

హారతిదుగో భద్రకాళీ మంగళారతిదుగో
వీరం భద్రేశు రాణీ ॥ హారతి ॥
1. కోరికతో గొలచేదాము । మాకాధారువై
కాళికామమ్మకావు ॥ హారతి ॥
2. నీ మహిమతేలియగకోరీ । ఈ మహిలోన
మహమ్మాయివమ్మా తోలిసారీ ॥ హారతి ॥
3. ఘోర శక్తి స్వరూపి వినీవు । వీర భద్రుని తో సరి
జేరియున్నావు ॥ హారతి ॥
4. భూరిశంకు జాగంట రవంబు । బేరినాదామృదంగాల
ఘోరనాట్యంబునా ॥ హరా ॥
5. నిష్ఠతో మిమువేడుచుంటినీ దృష్టిచే రక్షించ
శ్రేష్టివనియంటీ ॥ హారతి ॥
6. పంచకళపుర మందునీవు । ప్రబలమైనట్టి మీ శక్తి
ప్రకటించినావు॥ హారతి ॥

## 44. మంగళహారతి

మంగళాంబిదే శ్రీ వీర భద్ర మంగళాంబిదే
అంగుగా మాకడకుచెంగు చెంగున జేరి
మంగళం మీదే శివపుత్ర మీకును జయమంగళం ॥ మంగళాంబిదే ॥

1. దీక్షాభూనియు । ఆదక్షుని దృంచగా ॥ దీక్షా ॥
లక్షాలాదిగా యసురుల దునిమియు । శిక్షలుచే
సిన దక్ష ధ్వంసకా ॥ మంగళాంబిదే ॥

2. రుద్రకోపమూ । ఆభద్రునిరూపము ॥ రుధ్ర ॥
నిగ్రము గనుయింద్రారిదేవతలు శీఘ్రముగను
మీముందు జేరుభళి ॥ మంగళాంబిదే ॥

3. శరభారూపుడూ । రణరంగదీరుడు ॥ శర ॥
సురచిరముగయానారసింహుని శిరముము
దృంచిన శౌర్య శూరునకు ॥ మంగళాంబిదే ॥

4. మరువజాలను యుర్వ్యలోనదేవా ॥ మరువ ॥
సర్వదేవతలు సంబర మొందుచు పర్వదినంబున ప్రార్థన చేయచు
॥మంకళా॥

5. గాంచీవేడిరీ । యా దీనులందరిల ॥ గాంచి ॥
అంచితముగ మీ అద్భుత రూపము పంచకళా
పురి ప్రకటిం చే ప్రకాశము ॥ మంగళాంబిదే ॥

## 45 మంగళహారతి (బృందావనమది అందరిది)

1. మంగళహారతి గొనుము మహేశా
మమ్ముల బ్రోవుముజగధీశా
మాయిలవెల్పువునీవయ్యా
మా మంగళములుగైకొనుమయ్యా ॥ మంగళ ॥

2. నిఖిలాధారము నీవయ్యా
నిన్నేనమ్మితి రావయ్యా
సుఖశాంతులను నీయవయ్యా
ప్రకటితిముగ మిముకొలతుమయ్యా ॥ మంగళ ॥

3. నందివాహన నాగభూషణా+
యిందుశేఖరతవస్మరణా
అందుకొనుము యీ భక్తబృందముల
సుందర హారతి శుభదాయకహరా ॥ మంగళ ॥

4. భక్త పాలనా దుష్టశిక్షణా । శక్తిప్రియాకర
శశివదనా। రక్తిచేత మీ చరణము నమ్మినా
రాజేశ్వర హారతి గొనుమా ।మంగళ॥

5. రుద్రరూపుడవు నీవయ్యా । రుద్రాక్షదారివినీవయ్య
చిద్రూపముగనీ, రాజమౌళి సదా
భద్రముతోడను భక్తి భావముచే ।మంగళ॥

## 46. మంగళహారతి

హారతి ఉమరమణా సదా శివ ॥ హారతి ॥
నారదాది మునిసేవితచరణా
సురనరపూజిత గిరిజారమణా ॥ హారతి ॥

1. ఆదిలో శ్రీహరి వ్రతమును చేయగ
మాధవునకుముని శాపము బాయగా ॥ హారతి ॥

2. జనకుని పుత్రిక సీతయు సలుపగా
జగదభిరాముని పరిణయమాడేగా ॥ హారతి ॥

3. భద్రునిశూలయు బాపితివయ్యా
శ్రద్ధతో వ్రతమున చేసినలయ్యా ॥ హారతి ॥

4. గోపబాలకులు వ్రతమాచరించగా
శాపాల పాలైన భూపాలుని బ్రోచేగా ॥ హారతి ॥

5. దేవేంద్రాదులు సురముని గణములు
భావములోనిను భజియించిరి సదా ॥ హారతి ॥

6. ధరణిలోని మాదాసుడు రాజమౌళి
ధర్మము దప్పక దివ్యజోతులతో ॥ హారతి ॥

## 47 మంగళహారతి (ఆది తాళం)

మంగళంబులు గొనుము మహాదేవా । సంగీత ప్రియ శివ
పొంగుచుననన్నేలనిటురావా ।

1. అంగజాంతక మంగళకరా । భృంగిపోషక సంగమేశ్వర
గంగధరకరుణించవేరా లింగరూపసాంబ శివ
హర ॥ మంగళం॥

2. పాలకడలిని సురలు అసురులనూ । మధియించ గాను
చాల భయముచాతవిశమును పాలవలే
మ్రింగియు నీవే గోలచేయక సురల బ్రోచిన ।
నీలకతా నిఖిల పూజ్యా ॥ మంగళం॥

3. సోమశేఖర గావవేమిరా । భ్రమరాంబప్రియ శివ
కామ సంహార బ్రోవవేమిరా । మారకోటి మదన
రూప సారసాక్షుసర్వరక్షక
కూరిమితో రాజమౌళిని ప్రేమతోడా బ్రోవుదేవా ॥ హారతి ॥

## 48 మంగళహారతి

శ్రీ విశ్వనాథాయ మంగళం । శివా విశ్వాది

॥ పాలాయ మంగళం ॥ శ్రీవిశ్వ ॥

విశ్వేశ బీజాయ, విశ్వప్రకాశయా

శ్రీవిశ్వవేధ్యాయ మంగళం, శివ, విశ్వేశ లింగాయ మంగళం ॥ శ్రీవిశ్వ ॥

1. ప్రణవాత్మ దేహాయ మంగళం

శివప్రాణైక్యలింగాయ మంగళం

అణురూప రూపాయ, అనంతతేజాయా

ఆనంద నిలయాయ మంగళం । శివా

ఆధ్యాంత వేధ్యాయ మంగళం ॥ శ్రీ విశ్వ ॥

2. చర మూర్తి వంధ్యాయ మంగళం స్థిరా

పరమాత్మ రూపాయ మంగళం

గురురూప ధారాయా వరభక్తపాలాయా

వైరాగ్య ధీరాయా మంగళం, శివా

వర్ణనా తీతాయా మంగళం ॥ శ్రీ విశ్వ ॥

3. దాస హృదీశాయ మంగళం, శివాదాసా విలాసాయా

మంగళం । దోషాపహారాయ । కాశీపురీశాయా

పరిపూర్ణ కారాయ మంగళం

దాస, రాజమౌళీంద్రయ మంగళం ॥ శ్రీ విశ్వ ॥

## 49 మంగళహారతి

కర్పూర జయ హారతి కందర్ప భంజనా ॥ కర్పూ ॥

1. ॥ సర్పభుషణ ధారి సర్వేశ విముక్తోరి

నేర్పుతేడను హర్తి అర్పింతు మదిస్ఫూర్తీ ॥ కర్పూ ॥

2. దివ్య సుందరాకార దేదీప్యగంభీరా
యేవేళమిము జేరి ధ్యానమరయవనుకోరి ॥ కర్పూ ॥
3. కర్తవు భోక్తావు కారణమయుడవు
మూర్తిస్వరూపుడవు మృత్యుంజయా మీకు ॥ కర్పూ ॥
4. దేవాది దేవుడవు దివ్యప్రభువుడవు
భావంబు రంజిల్ల భవుడావు నీవనుచూ ॥ కర్పూ ॥
5. గాంచిననీవాయా పంచాక్షరీ ధ్యేయా
పంచకళపురినిలయా ప్రత్యేక్ష దేవాయా ॥ కర్పూ ॥

## 50 జోలపాట

జో శివయోగీంద్ర జో గుణాసాంద్రా
చెంద్రశేఖర ఈశ రజిలాచేలేంద్రా ॥ జో జో ॥
1. లాలితంబుగ మీదు లీలలుదెలియా
చాలమోదంబాయే యేపాలాక్ష సదయా
చల్లని గిరులపై వెలసినావయ్యా
ఎల్లలోకాలను యేలినావయ్యా ॥ జో జో ॥
2. ప్రమథగణంబులు ప్రక్కనిలువా
పార్వతి దేవియు పాదంబు లొత్తా
నారదా తుంబురులు గానంబుచేయా
మురిపెంబుతో నిదురపోవయ్య స్వామీ ॥ జో జో ॥
3. హాలా హలంబును గళమందు దాల్చి
చల్లగాసురలను రక్షింపదలచి
లోకాల గాంచి నా లోకేశ్వరాయా
కలకాలమున మీకు మెలకువేమయ్యా ॥ జో జో ॥

4. మృత్యువును బాసినమృకండుసుతడూ
మోదంబుతో భక్త మార్కొండేయు గంచీ
యమధర్మరాజుతో యుద్ధంబుసలిపీ
శ్రమదీర్చుటకునిదురపోవయయ్యా స్వామీ ॥ జోజో ॥

5. రమ్యమైనా పురము రజితాచలంబూ
కామ్యంబుతోయిలకడతేర్చుటకు నూ
పుణ్యులను జేయుటకు పుడమి కేతించీ
పంచకళపురిలోన పరగవెలిశావూ॥ జోజో ॥

## 51 మేలుకొలుపు పాట

మేలుకోను శ్రీ పార్వతీశా । మేలికొను పరమా
త్మయీశ । మేలుకొను శివ సుప్రకాశ ॥
మేలుకొనవయ్యా ॥ శంభో మేలుకొనవయ్యా ॥

1. సృష్టిలో నా ఉదయవేళలో సూర్యుడుదమించే
ను సరగున । అష్టమూర్తి స్వరూప శివ
మమ్మాదుకొనవయ్యా ॥ శంభో మేలుకొనవయ్యా ॥

2. దేవతా సురగణములేల్లగావు మని నిమదల
చిరంతా । కేవలంబుగ నీదు రూపము కోరి
సేవలుజేయుచుండిరీ ॥ శంభో మేలుకొనవయ్యా ॥

3. పంచభూతములందు గూడియు । సంచరించే
సాంబశివుడవు । అంచితముగా పంచకళ
పురవాస ఈశ్వరమేలుకో ॥ శంభో మేలుకొనవయ్యా ॥

# సంపూర్ణము

ఓం శాంతి శాంతి 00000శాంతి హి:

సర్వజనాని సుఖినో భవంతు

సమస్త సర్వమంగళాని భవంతూ

ఓం శివ దీక్ష ప్రతిజ్ఞ

భక్తి జ్ఞానవైరాగ్యము నాజన్మ హక్కు దీనికిభద్దుడనై నెను దీక్ష బూనగలను
నిర్మలహృదయుడనై ధర్మార్థకామ మోక్షములకై , సర్వకాల
సర్వవేళ్ళలయందు, దైవకార్యము
లందాశక్తి కలిగి యుండగలను సదాచార సంపన్నుడవై ప్రసిద్ధ పొందగలను,
జీవహింస మతచోరుజార గుణంబుల వదలి !జీవైక్యము పొందగలను
ప్రీతిక్షణము ప్రణవ పంచాక్షరి మంత్రమును జపించగలను ప్రీతితో
గురువులను, పరమ భక్తులను పూజించగలనూ
పరిపూర్ణ హృదయుడనై పరమాత్మ నెరుగుటకై ఈ నియమావళికి
భద్దుడనై ప్రవర్తింతుననీ సద్గురు సాక్షీగా ప్రమాణము చేయుచున్నామూ.

శ్రీ భ్రమరకాళిక - వీరభద్రస్వామి దేవాలయము గ్రామము పంచకళ్ళపేట,
జి॥ఆదిలాబాద్

ఇచ్చట ప్రతీ సం॥ మహాశివరాత్రికి గొప్పవైభవముగ జాతర జరుగును
కావున భక్తులు దర్శించగలరని మనవి.

